ప్రథమ ముద్రణము : 500

వెల : ఒక రూపాయి

నందన : ఉగాది; మార్చి 1952
నెల్కం ప్రెస్, గుంటూరు

# అ రు ణో ద య ము

"సాహిత్య- సమాలోచనము,' "సాహిత్య- సంపద", "సాహిత్య- సమీక్ష";, "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" ప్రభృతి గ్రంథపరంపర మూలంగా శ్రీ పిల్లలమర్రి ఈనాటి ఆంధ్ర విమర్శకాగ్రేసరులలో ఒకడని విఖ్యాతిగడించుకున్నాడు. ఒక వంక విమర్శకుడుగా విశృంఖల విహారం చేస్తున్నా మరొక వంక తాను సాహిత్య క్షేత్రంలో ప్రవేశించింది మొదలు కవితా వ్యవసాయం సాగిస్తూనే ఉన్నాడితడు.

సాధన సమితి స్థాపనాచార్యులుగా "మధుకణములు" ప్రచురించి ప్రథమతః శ్రీ పిల్లలమర్రి తనలోని కవికుమారుణ్ణి పాఠకలోకానికి పరిచితుణ్ణి చేశాడు. ఇతని ఆనాటి మధుకణాలు నేటి రాగరేఖలుగా పరిణమించి రసికులను ఆశ్చర్యచకితుల చేస్తున్నవి. "రాగరేఖలు" పదిహేను సంవత్సరాలలో అవతరించిన సుమారు ఏబది గేయరచనల సంపుటి. శారదోపాసకుడైన శ్రీ పిల్లలమర్రి ఆంధ్ర శారదకు అక్షరాంజలులు అర్పించి గ్రంథారంభం చేశాడు. ఇది సముచితం. ఈ గేయ "సమాహృతిలో" అనంతమైన వస్తు

వైవిధ్యం గోచరిస్తున్నది. రాజకీయాలు, సంఘము, ప్రకృతి, ప్రేమ, పల్లెజీవితము ఈ రచయితను కదలించి పలికించినవి. "స్వాతంత్ర్య దేవి వచ్చె" "ఉత్పాతం" "మారణ హోమం" వంటి గేయాలు భారత రాజకీయాలకు సంబంధించినవి. "లేరో" "అశ్రుకణములు" "మానవప్రపంచం' వంటి గేయాలు సాంఘికాలు. ప్రకృతి-ప్రేమలకు సంబంధించిన "భ్రమరరాజా కోయిలా" వంటి గేయాలు-ఈగుచ్ఛంలోవిశేషాలు. శ్రీ పిల్లలమర్రిని పాలేరుజీవితం ప్రత్యేకంగాఆకర్షించింది. వారిజీవితం లోని వలపు-తలపులు; ప్రేమ-పిలుపులు "ప్రేమ' "పిలుపు" "ఆసేనె" వంటి రచనల్లో చిత్రించి నాడు.

పిల్లలమీద "పిల్లలమర్రి'కి ప్రీతి అధికం అన టంలో ఆశ్చర్య మేముంది? "బంగారు చెల్లాయి" "చిట్టి - కాకి" "తాయిలం" బాల సాహిత్యం. "చిట్టిరో' కావ్యం ఇతని కరుణారసపూరిత హృద యాన్ని అభివ్యక్తం చేస్తున్నది.

"జిజ్ఞాస" వంటికావ్యాలలో సృష్ట్యాది భావుక లోకాన్ని కదలించి పలికించిన జగద్రహస్యాలూ, నగ్నసత్యాలూ నిరూపితాలైనవి. ఇతని తత్వ

జిజ్ఞాసలో భారతీయహృదయమే పరిస్ఫుటితమవా తున్నది. ఉజ్వల కాలచక్ర భ్రమణంలో నిత్య నూతన విలాసాలతో కొంతకాలం నర్తించి యవనిక వెనుకకు తిరోహితమై పోయే ఋతుదేవతలను "సంక్రాంతి", "ఉగాదిలక్ష్మి" వంటి రచనలతో ఈ కవి ఆహ్వానించాడు.

"ఆరె బుల్ బుల్ తూ భి ఆ' - అన్న అఖ్తర్ భరన్ రికార్డును అనుసరించిన ప్రేమగీతం శ్రీపిల్లలమర్రి పర సంప్రదాయానుకూలములైన లయలకు ఆంధ్రభాషను, భావాలను ఎలా ఒదిగింపగలడో వ్యక్తం చేస్తున్నది.

ఈగేయ సంపుటిలో నవ్య సాహిత్యం పుటకల నుంచీ నేటివరకూ వచ్చిన వివిధ గేయ రచనా రీతులు నిబద్ధాలై కనిపిస్తున్నవి. సుగంధి, షట్పది, రగడ, ద్విపదల వంటి గానయోగ్యములైన వివిధ ఛందస్సులను ఈ కవి చేపట్టి తన శక్తిసామర్థ్యా లను వెల్లడించాడు. "ఆనందం" "నిర్వేదం" వంటి రచనల్లో "బ్లాంకు వర్సు' ఉపయుక్త మైంది. ఇది ప్రాచీనచూర్ణికలలోని వృత్తిగంధి వచనాన్ని జ్ఞప్తి చేస్తున్నది. అవధులు లేని ఆనంద నిర్వేదా

లను అనువదించటానికి ఛందో మర్యాదలతో కట్టుబడని ఈ రచనా విధానాన్ని స్వీకరించి శయ్యా సౌభాగ్యంతో స్వేచ్ఛావిహారం చేశాడు, శ్రీ పిల్లలమర్రి.

"ఓ దేవ దేవ" వంటి గేయాలు ప్రాచీన కృతి కర్తలైన తాళ్ళపాక వారినీ, సంకీర్తనం కృష్ణమాచార్యుల వారినీ జ్ఞప్తికి తెస్తున్నవి. అనంత వస్తు, విధాన వైవిధ్యాలతో నెగడి ఈ "రాగరేఖలు" కవికి గల భావనాబలాన్నీ, శిల్పసామర్థ్యాన్నీ సర్వత్రి ప్రస్ఫుటం చేస్తున్నవి.

గేయ మంటే సంగీత సాహిత్యాల" వాగర్థ ప్రణయం"తో ఏర్పడి ఏక భావాశ్రయమై, గాన యోగ్యతా యుతమైన ఆత్మకావ్య మనే రహస్యాన్ని శ్రీ పిల్లలమర్రి ఏనాడో గ్రహించాడు. ఆత్మాను భూతులను పఠితల హృదయాలకు హత్తుకునేటట్లు పలకటంలో ఈ కవి ఉద్వేగాన్ని ఊతగా గ్రహించాడు. నిర్మలమైన కవిత్వం ఇతని గేయకవితా కన్యకు జీవితం!

---

నవ్యసాహిత్య యుగారంభం నాటి కంటె నేడు గేయం విశేష ప్రాముఖ్యాన్ని గడించుకున్నది. చలనచిత్ర పరిశ్రమ, ఆకాశవాణి వంటి సంస్థలు ఈ రచనా విశేషానికి విశేషదోహదం చేస్తున్నవి. శ్రీ పిల్లలమర్రి రచనలు ఇతఃపూర్వం కంటే అత్యధికంగా ఈ రంగాల రెంటనూ ప్రచలితాలై ఇతనికి అధికతర కీర్తి ప్రతిష్ఠలను చేకూర్చవలసిన అవసరమైనా ఉంది.

వావిలాల సోమయాజులు

# ఆంధ్ర శారద

ఆంధ్ర శారద నీకు అక్షరాంజలులూ !
అందుకో ఆదుకో రావమ్మ మా యమ్మ ! !

తరతరాల్ మా యింట తాండవించితి వంట
తలపు తరగల వెల్లి, తళుకు బెళుకుల తల్లి !

తెలుగు నేలల పైన తేనె మాగాణిసీ
తీరుగా తేటగా తీర్చి దిద్దిన తల్లి !

పదకవితా సుదతికి మధుర గాన ఫణుతులన్
ముదముతో ముద్దుగా చదువ నేర్పిన తల్లి !

ప్రబంధ సుందరీ రస బంధుర భంగిమలూ
ప్రభలతో ప్రబలగా ప్రబోధించిన తల్లి !

నవకవితా యువతీ భావాభినయ గతులూ
శివములౌ లీలలన్ హావణించిన తల్లి !

ప్రణయ రాగము లోన ప్రణవ నాదము నింపి
ప్రవిమల యోగ నియతి ప్రసాదించెడి తల్లి !

ఆంధ్ర శారద నీకు అక్షరాంజలులూ !
అందుకో ఆదుకో రావమ్మ మా యమ్మ ! !

# ఆంధ్ర శారద

ఆంధ్ర శారద నీకు అక్షరాంజలులూ !
అందుకో ఆదుకో రావమ్మ మా యమ్మ ! !

తరతరాల్ మా యింట తాండవించితి వంట
తలపు తరగల వెల్లి, తళుకు బెళుకుల తల్లి !

తెలుగు నేలల పైన తేనె మాగాణినీ
తీరుగా తేటగా తీర్చి దిద్దిన తల్లి !

పదకవితా సుదతికి మధుర గాన ఫణుతులన్
ముదముతో ముద్దుగా చదువ నేర్పిన తల్లి !

ప్రబంధ సుందరీ రస బంధుర భంగిమలూ
ప్రభలతో ప్రబలగా ప్రబోధించిన తల్లి !

నవకవితా యువతీ భావాభినయ గతులూ
శివములౌ లీలలన్ హావణించిన తల్లి !

ప్రణయ రాగము లోన ప్రణవ నాదము నింపి
ప్రవిమల యోగ నియతి ప్రసాదించెడి తల్లి !

ఆంధ్ర శారద నీకు అక్షరాంజలులూ !
అందుకో ఆదుకో రావమ్మ మా యమ్మ ! !

# సంక్రాంతి

చిరుతల కనువుగ చిందులు త్రొక్కుచు
పాటలు పాడుచు పరుగులు పెడుతూ
దాసరి వచ్చి ఛెంగున వ్రాలాడూ
వేసము చూడా వేగము రారండి!

భవు నేత్ర విగతానల జ్వాలలు లా
క్రూరాహి ముఖగత జిహ్వాలు లా
భుగ భుగ మండే భోగి మంటలివి
శుభముల గూర్పగ గొలుతము రారండి!

ప్రతిభులు పన్నిన దొడ్డ వ్యూహము లా
పండుగ కన్నియ వపుర్లతలులా
వన్నెల వంపుల రంగవల్లులివి
కన్నుల పండువు సంతగ రారండి!

వ్యూహము లోపలి వీర శ్రేణులు లా
కృతుల లోపలీ అక్షర పంక్తులు లా
బారులు తీర్చిన గొబ్బి దేవర్లివి
భక్తితొ కొలుతము బిరబిర రారండి!

---

పంట లొండొంటి పల్కరించుకో
వెంట నంటి నడయాడు నట్లుగా
పరువము గూర్చె పాలవెల్లి యిది
మురిపెము దీరా చూతము రారండి !

చిఱునవ్వు పాలబుగ్గలన్ దొరలాడ
నును సిగ్గు కనుదోయి తళుకాడ
కన్నెపడతులా వెన్న జీవితాల్
పున్నెము వడయా దీవింతము రారండి !!

# ఉగాది లక్ష్మి

ఉగాది లక్ష్మిని చూదాము
వసంత లక్ష్మిని కొలుతాము
రారండి! రారండి ! !

రంగురంగులా పూ లివిగో
కమ్మని పూలా తావిదిగో
పూలను జేరే తే టిదిగో
ఝుమ్మను తుమ్మెద రవ మిదిగో
గున్న మామిడీ కొ మ్మిదిగో
కొమ్మ చివరా చివు రిదిగో
చివురుల మేసే పిక మిదిగో
రాగము గూర్చే స్వర మిదిగో
రారండి! రారండి ! !

ఉగాది లక్ష్మిని చూదాము
వసంత లక్ష్మిని కొలుతాము ! !

---

# స్వాతంత్ర్య దేవి వచ్చె

భారతీయ సోదరా
పారతంత్ర్యం పోయెరా
స్వాగత మీమ్మయ రార
స్వాతంత్ర్య దేవి వచ్చె !

భారతీయ సోదరీ
పారతంత్ర్య మింక సరి :
హారతీయ రావమ్మ
స్వాతంత్ర్య దేవి వచ్చె !

భారతీయ కవివరా
భవ్యకావ్య ఘణుతులా
సంకీర్తనల్ సేయరా
స్వాతంత్ర్య దేవి మ్రోల !

భారతీయ నాయకా
భార మంత నీదెగా
స్వాతంత్ర్య దేవి కెట్లు
సమ్మానం సేతువో !

భారతీయ హృదయాల
భేద రేఖ విడవలెన్
స్వాతంత్ర్య భారతాన
శాంతిజ్యోతి వెల్గవలెన్ !

స్వాతంత్ర్యో దయమ్ముతో
స్వరాష్ట్రోత్సవమ్మున్
అమరజాతి ఆంధ్రజాతి
అందుకొనీ మనవలెన్ !

భారతీయ సోదరా
భారతీయ సోదరీ
స్వాగత మిమ్మయ రార
హారతీయ రావమ్మ
స్వాతంత్ర్య దేవి వచ్చె !!

# ఉ త్పా త ము

౧

ఊహాతీతపు టుత్పాతం !
మహాసంక్షుభితపు జనపాతం !
ధర్మాద్వైతపు వ్యాఘాతం !
కర్మాతీతపు ప్రారబ్ధం ! !

ధైర్యం ! ధైర్యం !!
ధర్మం ! ధర్మం !!
శాంతం ! శాంతం !!

౨

చదువు లన్నీ చట్టుబండ లై
దాష్ట్య మంతా కరుడు గట్టినదై
హృదయా లన్నీ రాళ్లూ గు ళ్లై
మనసూలన్నీ మట్టిపా లై
గడ్డి కరపించిన దండీ !
గుడ్డితనం మప్పిన ధండీ !

మృత్యుహింస లేలికలండీ !
మానవధర్మ మికేదండీ ?
మారణహోమ మిక సుండీ !
సత్యాహింస లిక లేవండీ !
మన కింక బాపు లేడండీ –
మన కింక బాట యేదండీ ?

మానవ జాతి
శకలమ్ములై
వికలమ్ములై
చితికి పోయింది
చెదరి పోయింది-
మహాసంధాత ఏడండీ ?
మహాత్మాగాంధీ ఏడండీ ?

# మారణ హోమం

అది నరాంతకు ద్వేషోన్మత్తపు కృత్యం
అది ప్రాణాంతకు మతోన్మాదపు కృత్యం !
అది మురాంతకు ప్రలయకాల వేసం
అది కాలాంతకు వికటాట్ట హాసం!

అవిగో భయద ఘనాఘన గర్జనల్
అవిగో క్రూర దంష్ట్రి ఘట్టన ధ్వనుల్ !
అది ఘోరాటవీ దహ్యమాన దావానలం
అది క్రూరాసుర హన్యమాన హాలాహలం !

అది హృదయ విదారక దృశ్యం
అది అదయ నవిచారక కృత్యం !
అది మతకాసారమున క్రుళ్లిన హృత్పత్రం
అది వర్గసాగరమున క్రుంగిన హృద్యంత్రం !

అది అహింసకే మారణ హోమం !
అది ఆత్మీయతకే తీరని ద్రోహం !!

# ఎందూ కండీ

మాలో మేమూ తన్నూకుంటాం
మాలో మేమూ గుద్దూకుంటాం
ఐకమత్యం లేని మాకూ
ఎందూకండీ సొంతా రాజ్యం ?

తోటి వాణ్ణి తొక్కీ వేస్తాం
సాటి వాణ్ణి సాగా గొడతాం
మానవత్వం లేనీ మాకూ
ఎందూకండీ సొంతా రాజ్యం ?

బ్రహ్మీ గాణ్ణి భరతం పడతాం
కమ్మా కాపూ భేదం పెడతాం
వర్గ కలహం పెంచే మాకూ
ఎందూకండీ సొంతా రాజ్యం ?

సరుకూ దాచీ ద్రోహం చేస్తాం.
ధరలూ పెంచీ దోచూకుంటాం
ప్రజలా మోసం చేసే మాకూ
ఎందూకండీ సొంతా రాజ్యం ?

విద్యాహీనుకు పట్టం గడతాం
పరాయి వాడికి అలుసూ అవుతాం
ముందు వెనుకల చూడని మాకూ
ఎందూకండీ సొంతా రాజ్యం ?

మాటా మీదా నిల్వక ఉంటాం
మనిషీ నెవ్వరి నమ్మక ఉంటాం
మనసూ నిలకడ లేని మాకూ
ఎందూకండీ సొంతా రాజ్యం ?

అడుగడుగునా అడ్డూ పెడతాం
ఏమది అంటే సమ్మె చేస్తాం
సొంత యింటినీ కూల్చే మాకూ
ఎందూకండీ సొంతా రాజ్యం ?

[ వ్యంగ్య రచన ]

# ప్రశ్న

ఆంధ్ర రాజుల ప్రాభవమ్మును
ఆంధ్ర మంత్రుల బుద్ధి బలమును
ఆంధ్ర యోధుల విక్రమంబును
అందు కొన్నావా ?

ఆంధ్ర దేశపు భోగ భాగ్యాల్
ఆంధ్ర కళలా అంద చందాల్
ఆంధ్ర సాహితి తీరు తీయాల్
నిలువ రించావా ?

ఒకరి నొకరూ విశ్వసించుట
పలువురొకనీ అనుగమించుట
తోటి వానిని గౌరవించుట
నేర్చు కొన్నావా ?

మంచి చెడ్డల భేద పరిచే
పిన్న పెద్దల నెంచి చూచే
నిన్న నేడుల కలిపి నడిచే
దృష్టి కుదిరినదా ?

అల్ప విషయము నంతు జూచే
అసలు సూత్రము విస్మరించే
అధిక ప్రసంగము - మానగలవా
ఇప్పటికి నైనా ?

ఇంటి గుట్టును బైట పెట్టే
తోటి వానిని త్రొక్క జూచే
స్వార్థచింతన - మానగలవా
ఇప్పటికి నైనా ?

ఆంధ్రు డంటే అగ్ని గోళం
ఆంధ్రు లందరి దైక్య కంఠం
అనగ జెల్లీ అంద వలె బో
కామితార్థమ్ము !

# ప్రేమ గీతాలు

౧

[ "అరె బుల్ బుల్ ఝూఖి ఆ" అనే ఆషీష్ భరన్ రికార్డు ననుసరించి. ]

రావె వలపుల రాణి రా
మైత్రితోడ కూడగా... !

ఆనందమా కనగ నాతి నిన్
విశేష శోభ చే... !

హంస చాయ అడుగు లిడుతు
రావె అమృత బిన్దువే...!

మైకమె స్వప్నా తలాన
భావజ తపనే సుమా...!

అభ్యాగతి నహరహం !
ఎట్టి విధాన చూతువో...?

నా బహూ కృతేను చెల్మి -
ప్రేమ మన్దిర పాలనీ...!

హార్దపుం భావాలు చిల్కా-
కౌను పుల్కరింపగా...!

సురోచిస్సులా వెలార్పా –
అర్ద్రై మ్మిక ఆద్రుతిన్

రంభ మెవతె రాజిలన్?
సౌందర్య మరయ నీ దికన్!

ఓ ప్రియా, నిలబోదు నిమిషమ్
ఐహికం మరపింపవా ...?

౨

[ "మన్ కె ప్యాస్ ని గాకే జా" అనే
ఆషీత్ భరన్ రికార్డు ననుసరించి ]

మనసు వ్యాకుల మొందె గా
చూడనైన ఓ సాఖి రా !
ఓ... స్వర్ణా డోలికలన్దు తూగా
రంగుమై నింగీ పూతమై పోగా
అంభోరాశిని ; శీతమయూఖవ్
చెలియా! మరి చంద్రిక లేవీ ?
తేలీ - తేలీ పోదాం - రావె, రావె, రావె
రావె, మత్తపవను కల్మె విహాగాలు
నాగ, సుగన్ధా విరులా చాయా
అదియే నాకే సమూన మా ... !
కెమ్మోవీ సమమే మధుతోడా ...?
ఖ్యాతే ప్రేమపు బన్ధన్ వీడా ...?
మేన్ - ఎటో - వ్యామోహామె మేలౌ
భరియింప రా మధూళితో -
మనసు వ్యాకుల మొందె గా
చూడనైన ఓ సాఖి రా !

# కుసుమ రాజము

ప్రణయార్చన కుపకరించే
ప్రవిమల కుసుమ రాజమ
ప్రవిశ ! మామక హృదంతరమున !
ప్రవిశ !! మధురాలయమ్మున !!

దుష్ట లోకమున దురిత లోకమున
కంటకావృత కఠిన సీమలన్
కలగి పోకు మో కుసుమ రాజమ
తొలగి చేరు నా హృదయ సీమను !

అర్హాత బడయని అటవీ భూముల
గర్హాము ఫలమగు కఠిన సీమలన్
చొరబోకు మో కుసుమరాజమ
చేర రమ్ము నాహృదయ సీమను !

ప్రణయార్చన కుపకరించే
ప్రవిమల కుసుమ రాజమ
ప్రవిశ ! మామక హృదంతరమున !
ప్రవిశ !! మధురాలయమ్మున !!

# భ్రమర రాజా

భ్రమరరాజా ! భ్రాంతి వీడుమదె
సమయ మెరుగవె సుమము జేరగ ?

నీవు లేమికి నిదుర లేకా
సుమము సుడినడి సురిగి పోయెను !

నీదు రాకల కెదురు చూచీ
ప్రసవరాజ్ఞీ ఫలవరించెను !

నీదు గానము నాల కింపగ
రేకు లన్నియు తపము గొన్నవి !

నీదు కౌగిలి నభిల షించుచు
కుసుమ సౌరభ విభవ మున్నది !

భ్రమర రాజా ! భ్రాంతి వీడుమదె
సమయ మెరుగవె సుమము జేరగ ?

# కోయిలా

అలయింపకే - కోయిలా - అలయింపకే
అలయించి - కోయిలా - విలపింప జేయకే

పండు వెన్నెల లోన
ఇసుక తిన్నెల లోన
గుంపు కన్నెల లోని
ఇంపు చిన్నెల దాని
మనసు చూరగొన

అలయింపకే - కోయిలా -అలయింపకే
అలయించి - కోయిలా - విలపింప జేయకే

వినిపింపకే కూత
కనుపింపకే యెదుట
జనియించునే ప్రేమ
కనుపించునే మూర్తి

అలయింపకే - కోయిలా - అలయింపకే
అలయించి - కోయిలా - విలపింప జేయకే!

# పిలుపు

రావోయి రావోయి చందమామా !
నాతోడ రావోయి చందమామా ! !

చేతులూ బట్టుకొని
మనసులూ విప్పికొని
ముదముతో పోదాము ...

కథలనూ చెప్పుకొని
శాస్త్రాల విప్పికొని
చకచకా పోదాము ...

కొండ మలపుల గుండ
లోయ కుదుపుల గుండ
లీనమై పోదాము ...

తానొకడె మనకెదురు
తరలి వచ్చునో యేమొ
తొందరగ పోదాము ...

వెంట వచ్చిన వారు
వెడలి పోయిరి యపుడె
విరిగి పోవునో మనసు ...

వలపు గాథము నాకు
వాక్కు నాపును సిగ్గు
వప్పజెప్పగ నీవు ...

మా బావ నాతోడ
మాటాడె దాకుండి
మరలి వత్తువు గాని

రావోయి రావోయి చందమామా !
నాతోడ రావోయి చందమామ ! !

# ఆసేనె

అల్లదిగో ఆసేనె
ఆడిని నన్నునూ
అతికేసి నాదోయి ...!
అతికేపి నాదోయి ...!

ఆరోజు ...
ఆడెవరో నే నెరుగ
ఆడెరుగ డే నెవరో
ఇద్దరము ఆసేలో
సోద్దెముగ కూకుంటె
అల్లదే సమయాన
అతికి పోయిందోలె ...!

పొలము కల బోతేను
పక్కనే తానుండి
పుడకల్ని నా ముందు
పారేసి నవ్వుతూ
పరవే మరదలా
పరవే తొందరగ
ఎన్నె లొచ్చే యేళ

ఎనక ఉన్నది గాని
అని తాను నాతోడ
ఎకసెక్కె మాడాడు ...!

సేలోకి నీళ్లెడుతు
సెమటలో సేనుంటె
సేమమా మరదలా
సేమమా అనితాను
సల్లన్ని నీళ్లన్ని
సిలికాడు నామీన ...!

కుప్ప నూర్పిళ్లలో
కొలిచేటి అడ్లన్ని
కొంపదీ సెవరితో
కూయబో కంచేపు
కొంగులో పోసేసి
కొంచుబో మరదలా
కొంచుబో అనియేటో
సిత్రముగ నవ్వాడు
సోద్దెముగ చూశాడు ...!

# మరపు రాదోయి

మరపు రాదోయి
నాకు
మరుజన్మ కైనా !

మనసు నిలదోయి
ఇకను
మారు పల్కుటకూ !

పొద్దున్నె నిద్దరా
పొయ్యేటి నన్నేటో
గిలిగింతతో లేపి
'కల లేమి కన్నావో
కమ్మగున్నా యేమొ
కూశింత నా సెవిని
కుమ్మరించ' ని శాన
కొసరి అడిగే వోడు ...

పంట కల్లెము కాడ
పగటింత పని జేసి
నెత్తి మీదికి పొద్దు

నెమ్మదిగ వస్తుంటె
సద్ది తెచ్చే నేను
సక్క గొస్తునా లేదా
దారి డొంకల కేసి
తేరి సూసే వోడు ...

వంట కుప్పలు రెండు
పైపైన ఏసుకుని
నాకు పక్కనె తాను
నవ్వు కుంటూ జేరి
అడ్డ కంకిని ఒకటి
అందుకొని నమలుతూ
పొలము గట్టుల బట్టి
పదుచు పాటల బాడి
పండు ఎన్నెల తోడ
పల్లె జేరే వోడు ...!

మరపు రాడోయి
నాకు
మరుజన్మ కైనా !

# సమాధానము

ఉత్తుత్త మాటలకె
ఓ భామా!
ఉలికులికి పడతారె
యాం డైనా!

పొరుగింటి పుల్లమ్మ
పొగ శేత నా మీన
పొడుపు మాటలు సెప్పి
పుల్ల గీచగ సూసె ! ...

పల్లె మొలుపల నాడు
పడుసు లందరు జేరి
పాట పాడగ నేను
పది మందితో ఎల్లి ... !

పొద్దు గుంకిన యేళ
పల్లె కొచ్చే పడుసు
బయము శేతా తాను
పక్కనే నడిశింది ...!

సరసముగ దంపతులు
సుకము తోటీ వుంటె
సూసి ఓర్చా లేరు
సుప్పనాతీ పెజలు !

ఉత్తుత్త మాటలకె
ఓ భామా !
ఉలికులికి పడతారె
యాడైనా !

- "పాశేరు పాటల" లో నుంచి ]

# ప్రణయ కలహాపం

[నిజ కాంతునితో కలహించిన కమలాక్షి
తనమూర్తినే అతనిలో చూచుకుంటూ
పురుష ప్రకృతిని అధిక్షేపిస్తున్నది]

చిక్కు పడినా తంత్రు లన్నిటి
నొక్కపరి మీటినా విధముగా
ఝల్లు మన నా గుండె
ఘల్లు మని వచ్చింది !

గానాన్ని శ్రుతులతో కదుపుకొని
హృదయాన్ని చేతులతో అదుముకొని
జాలి గొలిపెడి చూపు
చురచురా చూసింది !

నే నేమొ ఘోరపాపి నటంచు
తా నేమొ న్యాయవాది యటంచు
నా వెన్కగను వచ్చి
నిలు మంచు అదలించు !

పరుగెత్తి పోతావు - దొంగవా ?
పాలింప నాకికను - లొంగవా ?

ఎన్నాళ్లో చూదాము
ఏపాటి బిగియింపో ?

మగవారి ప్రేమలూ ఇంతలే
పగవారికైననూ వలదులే
ఇటువంటి యెడబాట్లు
ఇటువంటి నగుబాట్లు !

వినోరి గుండెలూ కడు చెదరు
కన్నీరు సెలయేరు వలె పారు
నీ గుండె కఠినమో
నా రాతె జటిలమో !

ప్రేమ ప్రేమంటారు మీ వాళ్లు
ప్రేయసి న్విడిచేటి మొనగాళ్లు
గుట్టు తెలియద ? అసలు
వట్టి మాటల పసలె !
అనురాగ మంటారు మీ వాళ్లు
అపమార్గ వర్తనల మొనగాళ్లు
రెండు నాలుక లుండు
చెండ శాసనుల్లెందు !

రాగ రేఖలు ..........................................................

నవనీత సమమైన మనసులూ
జవ జీవ యుతమైన మనుషులూ
అనుకొనుట కబురులే !
అనుభవము దవ్వులే ! !

ప్రణయ కలహము..........................................................

# రాధికా విరహము

ఏ దిక్కు బోతివని వెదకుదూ ?
ఏ దారి యేగితని వెదకుదూ ?
కోపమే కొనిపోయె నందునా ?
కోరికే యటులుండె నందునా ?

వెన్నెలలో కయ్యాలు మరతువా ?
కౌగిలిలో భావాలు కరగెనా ?
పొదచాటు పదిలముగ నొదిగితో ?
ఎదనుండి పెకలింప దలచితో ?

ఎడబాటు ప్రేమ నతిశయించని
విడిపోతె నన్విడిచి యీ క్రియన్ ?
చాలు చాలిక రమ్ము నా కడకు
సైప జాలను విరహ భారమును !

ఏ దిక్కు బోతివని వెదకుదూ ?
ఏ దారి యేగితని వెదకుదూ ?
కోపమే కొనిపోయె నందునా ?
కోరికే యటులుండె నందునా ?

# ప్రేమ కావలె

పుడమి యందున
పేరు గనుటకు
ప్రేమ కావలె !
ప్రేమ కావలె ! !

మతము లన్నియు
హితము గనుటకు
ప్రేమ కావలె !
ప్రేమ కావలె ! !

పడతి యందున
ప్రణయ సుఖముకు
ప్రేమ కావలె !
ప్రేమ కావలె ! !

పరము నందున
పదము నిడుటకు
ప్రేమ కావలె !
ప్రేమ కావలె ! !

---

# శైశవము

జనని గర్భము వెడలు టేమో
కనిక తల్లి పెంచు టేమో
మనసు లోనే తలప లేనూ
పిన్న తనమునా !

జనకు తోడుగ జనుట యేమో
ధనపు మాటల విలువ యేమో
మనసు లోనే తలప లేనూ
పిన్న తనమునా !

లోక మందూ లోటు లేమో
లోకు లన్నను లొంగు టేమో
నాకు ఊహాలె పొడమ కుండూ
చిన్న వయసునా !

గరళ మన్నను గంతు లేస్తీ
అరిసె లన్నను ఆశ పడితీ
సరస మైనా సరణి నేనూ
అరయక పోతిన్ !

చిల్ల పెంకుల బిళ్ళఁ గోడుల
పిల్ల గాలుల నాడుకుంటూ
దొర్లి వైచితి నెన్ని నాళ్లో
పిల్ల వాడనుగా !

ఇసుక తిన్నెల నిండ్లు గట్టీ
ఆశ జీవుల నీసు గొలిపీ
త్రోచి వైచితి నిన్ని నాళ్లూ
పసి వాడనుగా !

ఈసు నొందదు నాదు భావము
ఆసువు లన్నను ఆశ లేకా
త్రోసి వైచితి నిన్ని నాళ్లూ
పసి వాడనుగా !

ఆడు కొనుటయె ఆర్యసూక్తి
పాడు కొనుటయె పరమ సూత్రం
గడపి వైచితి నాడి పాడీ
బుడత తనంబున్ !

# ఎవరు

నాకు తో డెవ్వ రోయీ
నాకు జేడెవ్వ రోయీ ?

కటిక చీకటి
కాటి కాపరి
భీతి గొలిపే
బ్రహ్మ రాక్షసి... !

విరహా తాపము
వేడి గాడ్పులు
రెచ్చ గొట్టే
రమణి రూపము... !

స్వార్థ జీవులు
వ్యర్థ చింతన
కొట్టు కెళ్లే
కాల వాహిని !

నాకు తో డెవ్వ రోయీ
నాకు జే డెవ్వ రోయీ ?

# లేరో

బిచ్చం లేనీ
భిక్షా పాత్రా
నిరాశ తోడా
నింగిని చూడా-

వయసు మళ్లినా
పూరి గుడిసే
దుఃఖం తోడా
నేలకు క్రుంగా-

అసువుల మొసవగ
అర్రులు జాచే
భీకర మృత్యువు
కవుంగలింపా-

ఏరో త్రాతలు !
లేరో త్రాతలు ?
లేరో ?

# అన్వేషణము

గగన మందున
కాన వచ్చని
కళ్ళు రెండును
చిల్లు లడగా
కలయ జూచితి

ఎందు దాగితి వపుడు ?
ఎందు బోయితి వపుడు ?

కొండ చాటున
కాన వచ్చని
గంపె డాశతో
కొండ లన్నీ
కొసరి వచ్చితి

ఎందు దాగితి వపుడు ?
ఎందు బోయితి వపుడు ?

కడలిలోపల
కనగ నగునని
కణము కణమూ
కరము తోడను
కలియ వెదకితి

ఎందు దాగితి వప్పుడు ?
ఎందు భోయితి వప్పుడు ?

# ఆ చుక్క

మూడు వేసవి లోన
పండు వెన్నెల లోన
కతలు సెప్పిన వేళ
కలువరించిన వేళ

నక్షత్ర లోకాన అటునొక్క చినిచుక్క

మినుకుమని మెరిసిందిలే !
మిణుగుర్లై వెలిసిందిలే ! !

పడతి గానక చాల
పలవించి పలవించి
విసుగు దోచిన మదికి
మసక దోచిన వేళ

మేఘాల సభలోన ఆచుక్క యెక్కడో

దాగుల్లు పోయిందిలే !
దోబూచు లాడిందిలే ! !

# మాయ

సంద్రుణ్ణి
ఆకాశ
మం కేటి చోటా

సూర్యుణ్ణి
ఉదయాద్రి
తా కేటి చోటా

ప్రాణాలు
తనువుల్ని
బా సేటి చోటా

దేవుణ్ణి
భక్తులూ
కలి సేటి చోటా

కలదేటి మాయమో
కళవళ మ్మొదవించు !

# అశ్రు కణములు

[ ప్రాయమందని పసికన్నె. అభము, శుభమూ ఎరుగని వయసులోనే పసుపు కుంకుమ మాసినది. చిన్నినాథుని విధి నోటబెట్టుకొన్నది ఎరుగని కన్నె సోయగముపైనా, అమాయకతపైనా జాలికల్గి రాలిన బిందువులివి ! ]

ప్రొద్దు ప్రొద్దునె
పొన్న పూలను
అద్ద మాదున
దిద్దుకొందువు

ఎవరి కోసర మింత ?
ఎందు కోసర మింత?

చిన్ని నాథుని
చిత్ర పటమును
పొన్న పూలతో
పూజ సేతువు !

ఎవరి కోసర మింత ?
ఎందు కోసర మింత ?

చెలుల గూడుక
చెలువు మీరగ
చిట్టి బొట్టును
పట్టు చుందువు !

ఎవరి కోసర మింత ?
ఎందు కోసర మింక ?

ఆట లందున
అలరు బోదులు
నాథు నడుగగ
నవ్వు కొందువు !

ఎవరి కోసర మింత ?
ఎందు కోసర మింక ?

# కడుపు తీపి

[తన కూనలను అన్యాయంగా పొట్టబెట్టుకోగా పలవిస్తూన్న ద్రౌపదికి అశ్వత్థామ అగుపించగా తన కడుపుతీపి కొద్దీ ఆమె అతణ్ణి ఇలా భాషిస్తున్నది.]

ఏ పాప మెరుగనీ
ఏ మర్మ మెరుగనీ
నా ముద్దు నా కన్న
పసివారి పొట్టబెట్టు కొంటివే
ఓరయ్యా
పండితా పుత్రు డనిపించితే !

నిశి రాత్రు లందునా
నిద్రించు వేళలా
నా ముద్దు బంగారు
పసివారి ...

పాల మిసిమిన్ బోలి
పండుటాకుల మించు
పసిమితో చెన్నారు
పసివారి ...

రాగ రేఖలు ..........

అస్త్ర శస్త్రాలనూ
అభ్యసింపా లేక
అనిమొనకు రాలేని
పసివారి ...

కరకు కత్తుల్నైన
కరుణతో కరగించు
కల్యాణ మూర్తులా
పసివారి ...

ఇనుప ముక్కల కన్న
గనుప రాతుల కన్న
పనికిమాలుచు నీవు
పసివారి ...

గురు శిష్య న్యాయాన్ని
పరికింపకే నీవు
పరుష తే చూపుచూ
పసివారి ...

కడుపు తీపి ..........

పురుషత్వ మేముంది ?
పరమార్థ మేమొచ్చె ?
వరహాల మూటలా
పసివారి ...

నీ కేమి చేసిరో
నిన్నేమి కూసిరో
నిష్కారణమ్ముగా
పసివారి పొట్టెట్టు కొంటివే
ఓరయ్యా
పండితా పుత్రు డనిపించితే !

# నిర్వేదం

ఏమిా పాతాళపు భయద గాంభీర్యం
అయ్యో పాషాణపు కఠిన కార్కశ్యం !

ఇదిగో కోప ఘూర్ణితాగ్నిగుండం
అమ్మో విషపూరితాశనిపాతం !

క్రుంగిపోయె క్రుంగిపోయె
హృదయమే కమిలిపోయె !
ప్రిదిలిపోయె ప్రిదిలిపోయె
హృదయమే వ్రక్కలాయె !
దగ్ధమాయె దగ్ధమాయె
హృదయమే భస్మమాయె !

పాతాళపు లోతుల్లో
పాషాణపు గతుకుల్లో
అగ్నిగుండపు అర్చుల్లో
అశనిపాతపు అరుపుల్లో

గుభేలున పడి
నలుగుడు పడి
చెవి చిల్లులడి
తల తగులడి
ఆశ కొడిగట్టింది !
దశ దిశలూ —
శూన్యాన్నే
నిశ్వసించాయి !
గాఢ ధ్వాంతాన్నే
ఆవలించాయి !
విషాగ్ని కీలల్నే
పుక్కిలించాయి !
అంతరిక్షాన
పక్షి రుతాల
వెకిలి నవ్వులూ
పిక్కటిల్లాయి !

అంతరంగాన అగ్ని వర్షం
వేయి ముఖాల కక్కుతోంది !
అంబుధి లోపల బడబాగ్ని

రాగ రేఖలు...........................................

ఉవ్వెత్తుగా చెలరేగింది !
కాననంలో కార్చిచ్చు
కరాళ జిహ్వల
జాచింది !

అంధకార బంధుర వీధుల్లో
దారుణ మారణ తిమిరాల్లో
భీకర తాడిత వీచుల్లో
దీపం కంపంతో కదలాడింది !
పాపం భయంతో పాకాడింది !
శబ్దం బెదరుతో నడయాడింది !

రసన రస విహీనమై
బెండు బారింది !
గళం గరళయుతమై
మండి పోయింది !
మేధ తిమ్మిరెక్కి
మొద్దు బారింది !

నిర్వేదం...........................................

విషానల కీలల వెళ్లగ్రక్కే దృక్కులు
వెంట బడ్డాయి !

కోడెత్రాచు తలల కోరలు జాచే
శబ్దాలు కూలద్రోస్తున్నాయి !

క్రూర కఠోర కరాళ దంష్ట్రిలు
పట పట పట కొరుకు తున్నాయి !

కొరవిన బడిన మానవ కంకాళాలు
హుమ్మని కబళింప నున్నాయి !

ప్రపంచ మంతా విక్రమించి
హరించింది కీర్తిబాలను !

శ్మశాన వాటికలో భస్మ జాలం
బెదిరిస్తోంది భవిష్యత్తును !

# ఆనందం

నవ వసంత కుసుమ సంతానాన్ని పులకితం
ఒనరించే మధుర వీచీ మందహాసాల్ని
పరికించావా ?

ఆకాశా న్నంతా ఆవరించిన
ఆహ్లాద చంద్రికల్ని చూచావా ?

హిమాల యోత్తుంగ శృంగంగా
ఉప్పొంగి పోయిన ప్రేమైక మూర్తి
హృదయ పరితోష జల నిధి తరంగాన్ని
తిలకించావా ?

అహో ఏమి ఆ మధురిమ !
ఏమా ఆహ్లాదం ! !
ఏమా ఆనందం ! !

వర్షాగమనం కోసం నిరీక్షించే రైతుకు
మేఘం పొడసూపింది !

చంద్రుని అవలోకింప కుతూహల పడుతున్న
కలువలకు జేని చల్లని చేయి
సోకినట్లైంది !

సుమయాత్ర సలుపు తూన్న ద్విరేఫాన్ని
పరిమళం పులకరింప జేసింది !

మధుర వాక్ఝరులు
అమృతాలై స్రవించాయి !

ప్రేమావలోకనోత్పల మాలికలు
ఒక్క గళ సీమనే కాదు -

శరీర మంతనూ
అలంకరించాయి !

హృదయమే నవనీతమై
ప్రణయ కవోష్ణతకు
కరగి ద్రవించింది !

నేత్రోత్పలాలు నంద హిందోళ సందోహంతో
కదలు లాడాయి !

చంద్ర ప్రకాశానికి చకోరికలు
పులకిత గాత్ర లైనాయి !

శరీరాన్ని ఆత్మ తోడై
నిలిచి నిలిపింది !

రాగ రేఖలు ..................................................

హృదయం పూచి పరిమళించింది !
నవ్వులు ప్రమోదాన్ని పుక్కిలించాయి ! !

హృదయ నిర్గత మధుర నాదము
ప్రణయ వీణా నిస్వనంతో
మేళవించింది !

అడుగులు అడుగులు కలసి పోయాయి !
ఆత్మలు ఆత్మలు హత్తుకున్నాయి !

కవి తోషం ఘోషించగా
దివి వచ్చి దీవించింది !
భువి మెచ్చి పులకరించింది ! !

ప్రణయ కుసుమంలో
ఆశా కిరణం ప్రసరించింది !

ప్రణయ సాగరంలో
ప్రమోద రత్నం ప్రభవించింది !

ఆనందం ..................................................

ప్రపంచ చరిత్రలో
స్వర్ణ భారతి
ప్రసవించింది !

ప్రకృతి గోళంలో
సుకృతి తొంగి చూచింది !

విరోధించే నరాధముల
పురా విభవముల
వితాడించగ -

వికృతి ముసించింద !
వినీతి హసించింది ! !

# ని దు ర

గోత్రా లన్నియు నొక్క టొకటిగ
పోవుచుంటను —

వాన చినుకులు టప్పు టప్పున
పడిన మ్రోతను —

తేనె గ్రోలగ పూవు చుట్టెడు
భ్రమర గీతిని —

మెల్ల మెల్లన వీచు చుండెడి
మలయ పవనుని —

అల్ల నల్లన నాడు చుండెడి
అలల సరణిని —

పైరు లన్నియు కోత కొచ్చిన
పచ్చ పొలముల —

నిర్మలమ్ముగ గానుపించెడి
గగన తలమును —

వరుస వరుసగ తలచితిని గాని
కునుకు పట్టదు !

ప్రక్క వనములో పక్షి సంతతి
పాట పాడగ —

కోయి లొక్కటి మనసు కలచెడు
కూత కూయగ —

వినుచు రాత్రుల రెండుగడపితి
కునుకు పట్టక !

నిదుర దేవత ! నిన్ను పొందగ
నేర నైతిని !

వదలి పెట్టకు నేటి రాతిరి
వ్యథల ముంచుచు :

మంచి ఊహల
పంచి పెట్టెదు : రాగవల్లరి !

రాత్రి పగలుల రాయబారివి
రాగదవమ్మ !

[ ఆంగ్ల కవి వర్డ్సువర్తు గీతాన్ని అనుసరించి ]

నిదుర

# బంగారు చెల్లాయి

చిన్న చిన్న చెల్లాయి
చిక్కుడు కాయ చెల్లాయి

పొన్న పొన్న చెల్లాయి
పొట్ల కాయ చెల్లాయి

కన్న కన్న చెల్లాయి
కాకర కాయ చెల్లాయి

వన్నె వన్నె చెల్లాయి
వంకాయ చెల్లాయి

చిట్టి చిట్టి చెల్లాయి
చింతకాయ చెల్లాయి

బంగారు చెల్లాయి
బాదంకాయ చెల్లాయి !

# చిట్టి - కాకి

చెట్టు మీద కాకి ఒకటి కూరుచున్నదీ
చిట్టి తల్లి దాన్ని చూచి పిలుచు చున్నదీ !

వెన్న ముద్ద కొరకు కాకి వేచియున్నదీ
చిన్ని తల్లి చేతి నుండి చూరగొన్నదీ !

కావు కావు మనుచు కాకి ఎగిరి పోయిందీ
కావు కావు మనుచు చిట్టి ఏడ్చి పోయిందీ !

ముద్దు 'బాల' నొకటి అమ్మ ముందు వేసిందీ
దాన్ని చూచి చిట్టి ఏడ్పు మానివేసిందీ !

# తాయిలం

తాయిలం తాయిలం !
మా మంచి తాయిలం ! !
తీయనీ తాయిలం !
కమ్మనీ తాయిలం ! !
ఏమిటో, చెప్పుకో —
ఏమిరా అన్నయ్యా !

తీయనీ దన్నావ్
కమ్మనీ దన్నావ్
చెప్పలే నంటావ ?
చిన్నారి చెల్లెలా !

అరిసే, పూర్ణం
లడ్డూ, జిలేబి
హాల్వా, బర్ఫీ
పేణీ, పేడా-

వీటిలో ఏదో
కావలె నొకటీ

అవునా కాదా ?
అనుంగు చెల్లీ !

మైసూర్ పాక్
బొంబయ్ మిఠా
గులాబ్ జామ్
కోవా ఖీరా

వీనిలో ఏదో
కావలె నొకటీ
అవునా కాదా ?
అనుంగు చెల్లీ !

# పాపాయితో ప్రపంచం

పాపాయి
ఏడుస్తే
ఎదజేర్చి
పాలిచ్చి
లాలించుతాది !

పాపాయి
నవ్వితే
ప్రేమార
హృదయాన
హత్తుకుంటాది !

పాపాయి
తోటేను
ముద్దుగా
పొద్దంత
గడుపుకుంటాది !

పాపాయి
ఏడుస్తే
జాబిల్లి
లేదూ !

పాపాయి
నవ్వితే
పండంటి
వెన్నెలా !

పాపాయి
తోటేను
ప్రపంచక
మంతాను !

# కలి కాఠిన్యం

కాన రాని దీ కలి కాఠిన్యం
కాలిడ బోకుర కర్దమ భూమిని !

పాలనీ మరపించి
విసమునే త్రాగించు !
పూలనీ భ్రమపెట్టి
ముండ్లలో నడిపించు !
వెలుగనీ మురిపించి
చీకటుల నుసిగొల్పు ...!

శిఖరాల కెక్కించి
పలురాల పడగొట్టు !
శాంతితో జోకొట్టి
చింతతో చెడగొట్టు !
దరిజేర బోధించి
చెరలతో వేధించు

కానరాని దీ కలి కాఠిన్యం
కాలిడ బోకుర కర్దమ భూమిని !

---

# మానవ ప్రపంచం

న్యాయానికి కాలం కానిది
ధర్మానికి స్థానం లేనిది—

మన ప్రపంచం !
నవ ప్రపంచం ! !
మానవ ప్రపంచం !!!

త్యాగానికి విత్తం లేనిది
ధ్యానానికి చిత్తం పోనిది-

మన ప్రపంచం !
నవ ప్రపంచం !!
మానవ ప్రపంచం !!!

లక్ష్యానికి రూపం లేనిది
కామానికి కల్లెం లేనిది—

మన ప్రపంచం !
నవ ప్రపంచం !!
మానవ ప్రపంచం!!!

# ఉద్బోధ

తలపులు తనువులు
మలినము లైనవి :
అచ్చపు జాడల
నరయండోయ్ !

పుత్రులు బుద్ధులు
బూజులు పట్టెను :
పులు గడిగి కొన
తరలండోయ్ !

వేషము భాషయు
వేసెను వెట్టుల :
సభ్యత నిలుపగ
మరలండోయ్ !

మతములు శతములు
మతకరు లాయెను :
కతముల నరసీ
కదలండోయ్ !

# వేదన

౧

ఎన్ని జన్మా లెత్తి తీనో
ఎన్ని పాపా ల్జేసి తీనో
ఇన్ని పాపామూల కొఱకే
నెన్ని జన్మా లెత్త వలెనో ?

ఎన్ని నిష్టల జరుప వలెనో
ఎన్ని శిక్షల పొంద వలెనో
అన్ని ధర్మా ల్మంట గలిపే
ఎన్ని కర్మల జేయ వలెనో ?

అన్ని భోగము లనుభవింపా
ఉన్న గడియల నన్ని గడిపి
పన్నగ శయను మాటె మర చే
నెన్ని పాట్లను పడగ వలెనో ?

౨

కళ్లు తెరిచినా
కటికచీకటులె—
చెవులుమూసినా
చెడ్డరోదనలె—
హృదయావేదన
హరించుమార్గం—
అగుపడదూ !

ఎన్ని చదివినా
అంత మాత్రమే—
ఎంత బ్రదికినా
అంధ జీవనమె—
వెలుగులోకీ
వెడలు మార్గం
అగుపడదూ !

# ధర్మ జిజ్ఞాస

ధర్మ మెల్ల జీవులకు సమానం
ధర్మ పదవికి దయ ప్రధానం
ధర్మ మెల్లెడ పూజ మానం
ధర్మ రహితము జన్మహీనం !

ధర్మ మొక్కటె జగతి గాచును
ధర్మ మొక్కటె దేవదేవము
ధర్మ మందున దృష్టి నుంచుము
ధర్మ మొక్కటె పొందు రసమును !

ధర్మ మొక్కటె విశ్వసూత్రం
ధర్మ స్థాపన బహు పవిత్రం
ధర్మ మందటి ప్రాణ మిత్రం
ధర్మ మందని దేది పాత్రం !

ధర్మ రహితము దేవరహితము
ధర్మ శూన్యము రక్షశూన్యము
ధర్మ దక్షత విజయ మిచ్చును
ధర్మ చింతన పరము నిచ్చును !

---

ధర్మ బధిరుడు నరకమందును
ధర్మ రసమే మధుర భావము
ధర్మ కార్యము ధరణి నిలుచును
ధర్మ రక్షణ, జనుడు! చేయుము! !

# జన్మ మెత్తి వృథా

జన్మ మెత్తి వృథా వృథా
కర్మ మహిమ గనక బుధా !

రుజా జరా కలిత వ్యథా
తప్ప దేరి కైన బుధా !

మృత్యు మకుట ధారి సదా
జీవి : తిరుగు లేదు బుధా !

రజ స్తమో గుణ ప్రథా
సత్త్వ దూరు జేయు బుధా !

అర్థ కామ దాసు కథా
ధర్మ మెఱుగకుండు బుధా !

శత్రు లార్గు రుంద్రు గదా
మాయ వీడ నీక బుధా !

పాయ గాను లోని క్షుధా
భక్తి రసము గ్రోలు బుధా !

అని సత్య జ్ఞాన సుధా
ఆత్మ తత్త్వ మెఱుగు బుధా !

---

# తరగ రహస్యం

గాలినైనా
వారినైనా
చలనంబే సం
చలనమె లేదూ !

చేతగు నంతలో
చలనమె లేకా
పయనం బైంది
పడవొంటరిగా !

హెచ్చరి కెరుగక
మచ్చిక తోడుత
చప్పుడు లేకా
తప్పుడు త్రోవా
త్రొక్కుచు నున్నై
తరగల్ కొన్ని !

తలవని తలపుగ
తరగ లున్నించీ
తరగ లొక్కాన్ని
చెదరుచు వచ్చీ
పడవకు చేరువ
మసలుచు న్నన్నై !

తరగల తలపులు
కనగను మెఱుపులు !

తరగల తలపులు
వినగను వెఱపులు !

పడవకు ప్రక్కా
పయనం బగుటా
తరగలుక్కాన్నా
యొక్క రహాస్యం !

పడవకు దాపుగ
పయనం చేస్తూ
తీరము జేరుట
దివ్యరహాస్యం !

రహస్యమెరిగియు
రహదారి విడచీ
విహారసరణీ
విధంబు గడిపే
తరగల్ వారిన్
నశింపకున్నె ?

కాదు, సాగరం ఇహము ; పడవ వేషము ;
తరగలు మనుజులు ; తీరము స్వర్గము

# మొరటు పిల్లలు

మొరటుగా ఉన్న పిల్లలువారు !
అందుకే అరికట్టారు మావారు !!
నన్నా నీడకుండా వారితో—

మాటల రాళ్లలా విసురుతారు
చినిగిన బట్టలు కట్టుతారు
చినికి పాత గుండ తొడలగుపిస్తూ
పరుగెత్తుతారు వీధిలోకి వేగ !
అధి రోహిస్తారు పర్వతాల నిట్టె !!
పరుగెత్తుతారు పల్లెవాగులవెంట !!!

ఉక్కులాంటి వారి కండరాలకు—
కదలులాడు వారి కరాలకు—
భయము నొందినాను మెండుగా :
సింహాలకు కన్నా ఎక్కువగా !

పొదలనుండి గంతేశారు కుక్కల్లా
ప్రపంచాన్ని చూచి మొరగడానికి !

---

బురద నింత చిమ్మేశారు వంతుల్లా—
ప్రపంచాన్ని చూచి విసుకు జెంది !

మరోవైపు ముఖం పెట్టాన్నేను
నవ్వుతోన్న ట్టభినయిస్తాను !
అయినా నవ్వారు కారు వారు
మొరటుగా ఉన్న పిల్లలు వారు !!

[స్టీఫెన్ స్పెండర్ ననుసరించి]

# ధృతి నిల్పు మోయి

ధృతి నిల్పు మోయీ
నేడైన
శ్రుతి గొల్పు మోయీ
నీ వీణ !

విప ద్భావమ్ములకు
విస్తు పోవక నీవు
ప్రేమైక సూత్రమ్ము
ప్రియముతో బఠియింప ...

వియ త్పథమ్ములలో
విహరింప జేయు నా
లలిత కళా లయమ్ము
చలిత తంత్రుల జేర్చి

ధృతి నిల్పు మోయీ
నేడైన
శ్రుతి గొల్పు మోయీ
నీ వీణ !

# ఓ దేవ దేవ

నా వల్ల గాదయ్యా
నీ సేవ జేయా
ఇది కల్ల గాదయ్యా
ఓ దేవ దేవా !
మోహాగ్ని దేహాముతో
స్నేహమ్ము చేకొనియే.! ॥నా॥
ధనదాహ మోహ్యాదినీ
తనదీగ చేకొనియే ! నా॥
మమకార మదిహెచ్చి
తమసమ్ము మదిజోచ్చె ! ॥నా॥
సంసార భారమిదీ
నాసార మూహరించె ! ॥నా॥
ఈజీవి బ్రోచేటి
భారమ్ము నీదాను
నా వల్ల గాదయ్యా
నీ సేవ జేయా
ఇది కల్ల గాదయ్యా
ఓ దేవ దేవా !

# ఓ దివ్య గాయకా

ఓ దివ్యగాయకా !
ఓ నవ్యభావుకా !

నీ పాటలే విన్నాము
నీ ఆటలే కన్నాము
అమృతాలొలికాయి !
అందాలె చిందాయి !

నీ చిత్రాలె చూచాము
నీ శిల్పాలె తలిచాము
ఆనందమే ఒదివింది !
ఆలోచనే కలిగింది !

పసిపాప నవ్వులో
సెలయేటి శ్రుతులలో
కడలి తరగల్లో
నీ పాటలే విన్నాము !
నీ ఆటలే కన్నాము !

మందమారుతమ్ములో
కుందనపు మూర్తిలో
పసి లేగ నడకలో
నీ చిత్రాలె చూచాము
నీ శిల్పాలె తలిచాము !

ఓ దివ్య గాయకా !
ఓ నవ్య భావుకా !

# నమో నమో

నవోజ్జ్వల కాంతి పతాకకు
నమో నమో !

భవ్యాద్భుత క్రాంతి పతాకకు
నమో నమో!

దివ్యోత్తమ శాంతి పతాకకు
నమో నమో !

అరి కంఠ లుంఠన
సముద్ర స్వరూపకు
నమో నమో !

విపత్కు కుక్షి విచ్ఛేద
కోగ్ర స్వరూపకు
నమో నమో !

# నమోవాకమ్ము

నను జూచి పొంగేటి
నను గన్న తల్లికీ
నమోవాకమ్ము !

నాకెపుడు కూర్చేటి
నను గన్న తండ్రికీ
నమోవాకమ్ము !

నా మనసు మలచేటి
నా పరమ గురువుకూ
నమోవాకమ్ము !

నన్నెపుడు రక్షించు
నాపాలి దైవముకు
నమోవాకమ్ము !

# చిట్టిరో!

చిట్టిరో! పట్టిరో!
తల్లిరో! బుల్లిరో!
కడుపులో చిచ్చొట్టి-
కన్నరో! చిన్నరో!!
పుట్టలో బొమ్మల్ల
మట్టిలో నుంటివో?
నీటిలో మాదు క
న్నీటిలో నుంటివో?
తళుకులో తెల్లనీ
వెలుగులో నుంటివో?
గాలిలో పూవుల్ల
తావిలో నుంటివో?
నింగిలో నీలాల
రంగులో నుంటివో?
చిట్టిరో! పట్టిరో!
తల్లిరో! బుల్లిరో!
కడుపులో చిచ్చొట్టి-
కన్నరో! చిన్నరో!!

# నాదమహతి

నాదమహతికి తంత్రులెన్నో
లెక్కలేనన్ని ఉన్నవోయీ!

నాదు మహతితో నాలపించుట
కేను నొక్కడ తగుదునోయీ!!

తంత్రి నొక్కటి మీటుకొనుచూ
దివ్యపురుషుల దింపగలనూ!

తీగ నొక్కటి కదుపుకొనుచూ
తీవబోడుల త్రిప్పగలనూ!

పాట నొక్కటి పాడుకొనుచూ
పాము లన్నిటి పట్టగలనూ!

తంత్రి నొక్కట తాళ మేసీ
తాండవానికి తావు నిత్తును!

తీగ నొక్కట తలపు పెట్టీ
తీయబలుకుల పలుకనిత్తును!

రాగ మొక్కటి రగులుకొలిపీ
భంగిమంబుల పొదిగివేతును!

ముదముగూర్చే ముగుదముచ్చట
ముచ్చటించే వేళ యొకటి!

నృత్యగీతము నేర్పడానికి
నాలపించే నాదమొకటి!

కావ్యగానపు కల్పనానికి
కథల నిచ్చే కంఠ మొకటి!

కొమ్మ యందలి కోయిలమ్మతో
కలసి పాడే రాగ మొక్కటి!

ఏటి రొదలనె యేరు కొనుచూ
వాటి సరణినె వరుస యొక్కటి!

భీతి గొలిపే యలల ఘోషలు
పిక్కటిల్లే ఫణితి యొక్కటి!

నాదు మహతితో నాలపించుట
కేను నొక్కడ తగుదు నోయీ!

నాదు మహతికి తంత్రులెన్నో
లెక్క లేనన్ని ఉన్నవోయీ!

# మా తెలుగు వెలుగు

మా తెలుగు వెలుగులే
దశ దిశల వెలగాలి!

మా తెలుగు కవితలే
మాధురులు చిందాలి!

మా తెలుగు బలములే
మన్ననలు పొందాలి!

మా తెలుగు పొలములే
మన కరువు దీర్చాలి!

మా తెలుగు నీరాలె
మన దప్పి తీర్చాలి

మా తెలుగు వారలే
మన కండ నిలవాలి!

మా తెలుగు దనమునే
మరు జన్మ లందాలి!!

# స్వాగతము

ఆదిమ దంపతులారా!
అరుదెంచిడిదె ప్రియమారా!!

అరుణోదయ శుభ రేఖల
మలయామల మధువీచుల
శుకసంతతి సురగానము
శ్రుతిమాధురి యొనగూర్చెడి!!

ఆదిమ దంపతులారా!
అరుదెంచిడిదె ప్రియమారా!!

నవ వసంత ప్రణవ శోభలో
నవ శరచ్చంద్ర చంద్రికలో
కవ గూడిన ప్రణయ ప్రసవము
కను గందక పూర్వమె యిటు

ఆదిమ దంపతులారా!
అరుదెంచిడిదె ప్రియమారా!!

# ఉపాయానము

పాత్రాస్వీకృతి పావన వేళా
పాణిగ్రహణపు పావన వేళా

పసుపూ కుంకుమ పళ్లెరములతో
పక పక నవ్వుచు ప్రకృతిమాతా

దేవత లంపిన దివ్యాక్షతలూ
అర్పించుటకై అరుదెంచినదీ !

సురవరు లంపిన శుభ సందేశం
అంధించుటకై అరుదెంచినదీ !

*

"అందించ బడినదీ అమరత్వ సిద్ధికై
ఈ దివ్య మధు పాత్ర ! !"

*

# రా గ రే ఖ లు

ప్రతి గ్రంథాలయములో ఉండదగినది!

ఆంధ్ర సాహితీ ప్రియులు ఎదురు చూస్తూ ఉన్న
అధికారికమైన ఏకైక నవ్యాంధ్ర సాహిత్య
చరిత్ర గ్రంథము!

తెలుగు సీమలో ఆంధ్ర గ్రంథము అచ్చుపడడము
మొదలుపెట్టినప్పటినుంచీ నేటివరకు
(1827 నుంచి 1950 వరకు) గల
వివిధ కవితోద్యమాలను, పలువుర కవి పండితుల
సాహిత్యజీవితాలను, వారి సారస్వత వ్యవసాయ
మును ఆంధ్రుల చరిత్రను అనుసరిస్తూ
సమగ్రముగా విమర్శించిన

శ్రీ కురుగంటి వారి

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

(ద్వితీయ ముద్రణము)

శ్రీ పిల్లలమర్రి వేంకట హనుమంతరావు, M A.,
గారి బహుకాల పరిశోధనముతో గూడి పరివర్ధితమై
ఆధికారికమై [illegible] శైలిలో నూత్నప్రకరణాలతో
వినూత్న [illegible]లతో పలువు రాధునిక కవి
పండితు[illegible] బొమ్మలతో [illegible] భాగములలో
[illegible] ముద్రి[illegible]ది!

వెల [illegible]డు రూపాయిలు

శారదా పీఠము :: గుంటూరు